# ఉదయం - సాయంత్రం ప్రార్థనలు

రోజంతా అల్లాహ్ రక్షణలో



కాంతిమార్గం పబ్లికేషన్ ట్రస్ట్, హైదరాబాద్

**ఖుర్ఆన్ వెలుగులో - 'అల్లాహ్ ధ్యానం'**

నీవు నీ మనసులోనే - కడు వినమ్రతతో, భయంతో - నీ ప్రభువును స్మరించు. ఉదయం, సాయంత్రం బిగ్గరగా కాకుండా మెల్లగా నోటితో కూడా (స్మరించు). విస్మరించే వారిలో చేరిపోకు.

*(ఖుర్ఆన్ 7 : 205)*

ఓ విశ్వాసులారా! అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి. ఉదయం, సాయంకాలం ఆయన పవిత్రతను కొనియాడండి. *(ఖుర్ఆన్ 33 : 41, 42)*

ఎక్కువగా అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండండి. తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు. *(ఖుర్ఆన్ 62 : 10)*

ఓ విశ్వాసులారా! మీ సిరిసంపదలు, మీ సంతానం మిమ్మల్ని అల్లాహ్ ధ్యానం నుండి మరల్చరాదు. ఎవరైతే అలా చేస్తారో వారే నష్టపోయేవారు.

*(ఖుర్ఆన్ 63 : 9)*

రోజంతా అల్లాహ్ రక్షణలో...

# ఉదయం సాయంత్రం ప్రార్థనలు

సంకలనం:

ఎస్.ఎమ్. రసూల్ షర్ఫీ

ముహమ్మద్ హమ్మాద్ ఉమరి

**శాంతిమార్గం పబ్లికేషన్స్ ట్రస్ట్,**

**హైదరాబాద్**

Morning & Evening Supplications (Telugu)

Title of the Book : Morning & Evening Supplications (Telugu)

Prepared by : S.M Rasool Sharfi
Muhammad Hammad Omari

Revised by : Manzoor Ahmed Omari



First Edition : August 2010

Copies : 2000

Hadya : Fee Sabeelillah

Publisher :

**Shanti Margam Publication Trust**
# 16-2-867/10, Akbar Bagh, Sayeedabad,
Hyderabad-500 059 Cell : 9676144697
E-mail: shantimargam@gmail.com

Printing Supervision :

**Al-Baseer Graphics,** Hyderabad
Cell: 9441055065



# రోజంతా అల్లాహ్ రక్షణలో...

అల్లాహ్ రక్షణ లేనిదే సృష్టిలో ఏ జీవరాశికీ ఒక్క క్షణం కూడా మనుగడ లేదు. సృష్టిలో అందరి కంటే ఎక్కువ అవసరాలు కలిగిన వ్యక్తి మనిషి. కనుక మనిషికి మిగతా సృష్టిరాసులన్నింటి కంటే ఎక్కువ రక్షణ కావాలి. భౌతికంగా ఈ లోకంలో బతకటానికి కావలసిన రక్షణను మనిషి అడగకనే అల్లాహ్ అతనికి ఇచ్చేశాడు. పోతే; మనిషి అంతరంగానికి అవసరమైన రక్షణ మాత్రం అతను స్వయంగా కోరుకుంటేనే గాని అది ప్రాప్తించదని నిర్ణయించబడింది. మరి అల్లాహ్‌రక్షణ లభించే ఏకైక మార్గం ఏమిటో తెలుసా?! అదే ప్రార్థన (దుఆ)!

దైనందిన జీవితంలో "ప్రార్థన" (దుఆ)కు గల ప్రాముఖ్యత ఎనలేనిది. ప్రతి రోజూ మనం చేస్తూ ఉండే సకల ఆరాధనల సారం ప్రార్థన. జీవచ్ఛవమైన మనసుకు ప్రాణం పోస్తుంది ప్రార్థన. నిరాశాభావుల్లో సరికొత్త ఆశల్ని చిగురింప జేస్తుంది. ప్రార్థనా మహాత్యాన్ని గ్రహించిన వ్యక్తి జీవితాంతం అల్లాహ్‌ను ధ్యానిస్తూ, అనుక్షణం ఆయన్ను వేడుకుంటూ గడిపేయాలని కోరుకుంటాడు.

ఆపదలు ఎదురైనప్పుడు ప్రార్థనలు (దుఆలు) చేయటం సామాన్యుల లక్షణం. ఎలాంటి ఆపదలు లేకపోయినా తమ ప్రభువును ప్రార్థించటం ఉత్తముల విధానం. అలాంటి

పుణ్యాత్ములే అల్లాహ్‌కు అత్యంత ప్రీతి పాత్రులైన దాసులు. అల్లాహ్ అనుగ్రహానికి అర్హులు. ప్రియ ప్రవక్త ముహమ్మద్(స) ఏమన్నారో తెలుసా? –

కష్టాల్లో ఉన్నప్పుడు తన ప్రార్థన స్వీకరించబడాలని కోరుకునే వ్యక్తి సంతోష సమయాల్లో అతి ఎక్కువగా ప్రార్థనలు చేయాలి. (తిర్మిజీ)

కేవలం కష్టాలు, సుఖాల్లోనే కాదు, ప్రార్థన మన నిత్య జీవితంలో ఒక భాగం అయిపోవాలి. దుఆలు చేసుకోవటం ఒక దైనందిన అలవాటుగా మారిపోవాలి. ఉదయం సాయంత్రం నియమం తప్పకుండా వేడుకోలు వచనాలు పఠిస్తూ ఉండాలి.

అదే జరిగితే, మన జీవితాల్లో అద్భుతమైన మార్పు వస్తుంది. రేయింబవళ్ళు అల్లాహ్ రక్షణలో గడుపుతున్న అపూర్వమైన అనుభూతిని మనం పొందుతాం. ఉదయం పూట అల్లాహ్ వేడుకోలు వచనాలతో మొదలైన మన దినచర్యలు సాయంత్రానికి సకల శుభాలతో, శ్రేయాలతో ముగుస్తాయి. ఆ రోజంతా మన విశ్వాసంలో, ఆచరణల్లో తాజాదనం ఉంటుంది.

మరి ఇంకెందుకు ఆలస్యం? ఈ క్షణమే వెళ్దాం, అల్లాహ్ రక్షణలోకి!

– ప్రకాశకులు



## ఏ ప్రార్థన ఏ పేజీలో...

❀ ❀ ❀



# ఉదయం సాయంత్రం చేయవలసిన ప్రార్థనలు

## 1) ఆయతుల్ కుర్సీ

దివ్యఖుర్‌ఆన్‌లోని ఎంతో ఘనత గల 'ఆయతుల్ కుర్సీ' అనబడే ఈ క్రింది వాక్యాన్ని ఉదయం, సాయంత్రం పఠిస్తూ ఉండాలి.

**పఠించటం వల్ల ప్రయోజనమేంటి?**

ఉదయం పూట ఆయతుల్ కుర్సీ పఠించిన వ్యక్తి సాయంత్రం వరకు జిన్నాతుల బారి నుండి సురక్షితంగా ఉంటాడు. అలాగే సాయంత్రం పూట దీన్ని పఠించిన వ్యక్తి ఉదయం వరకు అల్లాహ్ రక్షణలో ఉంటాడు. *(హాకిమ్ : 1/562)*

అల్లాహు లా ఇలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూమ్, లా తాఖుజుహూ సినతున్ వలా నౌమ్, లహూ మాఫిస్సమావాతి వమా ఫిల్ అర్ద్, మన్ జల్లజీ యష్ఫఉ ఇన్‌దహూ ఇల్లా

బి ఇజ్‌నిహీ, యాలము మాబైన ఐదీహిం వమా ఖల్‌ఫహుం, వలా యుహీతూన బిషైయి మ్మిన్ ఇల్మిహీ ఇల్లా బిమా షాఅ, వసిఅ కుర్సియ్యు హుస్సమావాతి వల్ అర్ద్, వలా యవూదుహూ హిఫ్‌జుహుమా వహువల్ అలియ్యుల్ అజీం.

*(సూర బఖర 2 : 255)*

అల్లాహ్ (మాత్రమే నిజానికి ఆరాధ్య దైవం). ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేనేలేడు. ఆయన సజీవుడు; అన్నింటికీ మూలాధారం. ఆయనకు కునుకుగానీ, నిద్రగానీ పట్టదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయన అధీనంలో ఉంది. ఆయన అనుమతి లేకుండా ఆయన సమక్షంలో సిఫారసు చేయగలవాడెవడు? మానవులకు ముందు ఉన్న దానినీ, వెనుక ఉన్నదానిని కూడా ఆయన ఎరుగు. ఆయన కోరినది తప్ప ఆయనకున్న జ్ఞానంలోని ఏ విషయమూ వారి గ్రాహ్యపరిధిలోకి రాదు. ఆయన కుర్సీ వైశాల్యం భూమ్యాకాశాలను చుట్టుముట్టి



ఉంది. వాటిని రక్షించటానికి ఆయన ఎన్నడూ అలసిపోడు. ఆయన సర్వోన్నతుడు, గొప్పవాడు.

## 2) 'ఖుల్' సూరాలు మూడేసి సార్లు

ఈ క్రింద పేర్కొనబడుతున్న దివ్య ఖుర్ఆన్ సూరాలను ప్రతి రోజూ ఉదయం సాయంత్రం పఠిస్తూ ఉండాలి.

### పఠించటం వల్ల ప్రయోజనమేంటి?

ఖుబైబ్ (రజి) కథనం: మేము ఒకానొక రాత్రి భారీ వర్షం కురుస్తున్నప్పుడు దైవ ప్రవక్త(స)ను నమాజు చేయించమని పిలవటానికి చీకట్లోనే ఆయన్ని వెతుక్కుంటూ బయలుదేరాం. నాకు దైవప్రవక్త (స) కనిపించారు. ఆయన (స) నాతో, "ఖుల్" (చెప్పు) అన్నారు. నేనేమీ మాట్లాడలేదు. ఆయన (స) మళ్ళీ, "ఖుల్"(చెప్పు) అన్నారు. నాకేం చెప్పాలో అర్థం కాలేదు. ఆ తరువాత మూడోసారి కూడా ఆయన (స), "ఖుల్" (చెప్పు) అన్నారు. 'ఏం చెప్పాలి?'

అని అడిగాను. అప్పుడాయన, "ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం

"ఖుల్ హువల్లాహు అహద్...",

"ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్...",

"ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్..."

- (ఈ మూడు సూరాలూ 3 సార్లు) పఠించు. అన్ని రకాల కష్టాల నుండి సురక్షితంగా ఉంటావు" అని అన్నారు. (తిర్మిజీ-హసన్)

ఆ మూడు సూరాలు ఇవే:

**1. సూరహ్ ఇఖ్లాస్**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ హువల్లాహు అహద్. అల్లాహుస్సమద్. లమ్ యలిద్ వలమ్ యూలద్. వలమ్ యకుల్లహూ కుఫువన్ అహద్.



అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

ఇలా చెప్పెయ్యి, ఆయన అల్లాహ్, ఒక్కడు. అల్లాహ్ నిరపేక్షా పరుడు. ఎవరి ఆధారమూ, ఎవరి అక్కరా లేనివాడు. అందరూ ఆయనపై ఆధారపడేవారే. ఆయనకు సంతానం ఎవరూ లేరు. ఆయన కూడా ఎవరి సంతానమూ కాదు. ఆయనకు సరిసమానులు ఎవరూ లేరు.

**2. సూరహ్ ఫలఖ్**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్. మిన్ షర్రి మా ఖలఖ్. వ మిన్ షర్రి గాసిఖిన్ ఇజా వఖబ్, వ మిన్ షర్రిన్నఫ్ఫాసాతి ఫిల్ ఉఖద్. వమిన్ షర్రి హాసిదిన్ ఇజా హసద్.

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

ఇలా అను: నేను ఉదయం ప్రభువు శరణు కోరు

తున్నాను–ఆయన సృష్టించిన ప్రతిదాని కీడు నుండి, కమ్ముకునే చీకటి రాత్రి కీడు నుండి, ముడులపై మంత్రించేవారి కీడు నుండి, అసూయా పరుడు అసూయ చెందేటప్పటి కీడు నుండి.

**3. సూరహ్ నాస్**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్, మలికిన్నాస్. ఇలాహిన్నాస్, మిన్ షర్రిల్ వస్వాసిల్ ఖన్నాస్, అల్లజీ యువస్విసు ఫీ సుదూరిన్నాస్. మినల్ జిన్నతి వన్నాస్.

*అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

ఇలా అను: నేను మానవుల ప్రభువు, మానవుల చక్రవర్తి, మానవుల ఆరాధ్యదైవం (అయిన అల్లాహ్) శరణు కోరుతున్నాను – దుష్ట భావాలు రేకెత్తించే వాడి కీడు నుండి, వాడు మాటిమాటికీ మరలి వస్తూ ప్రజల మనసుల్లో దుష్టభావాలను రేకెత్తిస్తాడు,



వాడు జిన్నాతు జాతికి చెందినవాడైనా కావచ్చు, మానవ జాతికి చెందిన వాడైనా కావచ్చు.

## 3) ఈ ప్రార్థన కొంచెమే.. కాని పుణ్యం మాత్రం ఎంతో ఘనం

లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్. **(10 సార్లు)**

అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాములెవరూ లేరు. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే. ఆయన ప్రతి వస్తువుపై సంపూర్ణ అధికారం కలిగి వున్నాడు. *(సహీ ఇబ్నెమాజా 2/331)*

**పఠించటం వల్ల ప్రయోజనమేంటి?**

ఎవరైనా ఉదయం పూట ఈ వాక్యాలు పఠిస్తే– అటువంటి వ్యక్తికి ఇస్మాయీల్ సంతతికి చెందిన ఒక బానిసకు విముక్తి ప్రసాదించినంత పుణ్యం

లభిస్తుంది. (అంతేకాదు) అతని కర్మల జాబితాలో అదనంగా పది పుణ్యాలు లిఖించబడతాయి. పది పాపాలు తొలగించబడతాయి. అతనికి పదింతల పదోన్నతి లభిస్తుంది. ఇంకా సాయంత్రం అయ్యే దాకా అతను షైతాన్ నుండి సురక్షితంగా ఉంటాడు. ఒకవేళ ఈ వాక్యాలు సాయంత్రం పూట పఠించినా కూడా ఈ పుణ్యం లభిస్తుంది. అటువంటి వ్యక్తి ఉదయం వరకు షైతాన్ నుండి సురక్షితంగా ఉంటాడు. (అబూ దావూద్, ఇబ్నె మాజా-సహీహ్)

## 4) గొప్ప మన్నింపు ప్రార్థన

### (సయ్యిదుల్ ఇస్తిగ్ఫార్)

షద్దాద్ బిన్ ఔస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : అన్నింటికన్నా ఉత్తమమైన మన్నింపు ప్రార్థన (సయ్యిదుల్ ఇస్తిగ్ఫార్) ఇది. నువ్వు ఈ విధంగా ప్రార్థించు:



"అల్లాహుమ్మ అంత రబ్బీ లా యిలాహ ఇల్లా అంత, ఖలఖ్‌తనీ వ అన అబ్దుక, వ అన అలా అహ్‌దిక వ వాదిక మస్తతాతు, అవూజు బిక మిన్ షర్రి మా సనాతు అబూవు లక బినీమతిక అలయ్య, వ అబూవు లక బిజంబీ, ఫగ్‌ఫిర్‌లీ ఫఇన్నహూ లా యగ్‌ఫిరుజ్జునూబ ఇల్లా అంత."

అల్లాహ్! నీవు నా ప్రభువువి. నీవు తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. నీవు నన్ను పుట్టించావు. నేను నీ దాసుణ్ణి (నీ దాసురాలను). నీతో చేసిన ప్రమాణం మరియు వాగ్దానాన్ని నా శక్తిమేరకు నెరవేర్చటానికి కృషి చేస్తున్నాను. నేను చేసిన చెడు పనుల కీడు నుండి నీ శరణు కోరుతున్నాను. నీవు నాకు చేసిన ఉపకారాలను ఒప్పుకుంటున్నాను. నా పాపాలను అంగీకరిస్తున్నాను. నన్ను క్షమించు. నీవు తప్ప క్షమించే వాడెవడూ లేడు.

### పఠించటం వల్ల ప్రయోజనమేంటి?

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు – ఎవరైనా

పగటివేళ పూర్తి నమ్మకంతో ఈ వాక్యాలు పఠించి సాయంత్రం కాకముందే మరణిస్తే అతడు స్వర్గానికి వెళతాడు. అదే విధంగా ఎవరైనా రాత్రిపూట పూర్తి నమ్మకంతో ఈ వచనాలు పఠించి తెల్లవారక ముందే మరణిస్తే అతను కూడా స్వర్గంలోకి ప్రవేశిస్తాడు. *(బుఖారీ)*

## 5) అన్ని రకాల కీడుల నుంచి కాపాడే ప్రార్థన

"బిస్మిల్లాహిల్లజీ లా యదుర్రు మఅస్మిహీ షైవున్ ఫిల్ అర్ది వలా ఫిస్సమాయి వహువస్సమీఉల్ అలీం." (3 సార్లు)

అల్లాహ్ పేరుతో, ఆయన పేరు తోడుంటే భూమ్యాకాశాల్లోని ఏ వస్తువూ కీడు తలపెట్టలేదు. ఆయన బాగా వినేవాడు, అన్నీ తెలిసినవాడు.

### పఠించటం వల్ల ప్రయోజనమేంటి?

దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచించారు:



ఎవరైనా ఉదయం, సాయంత్రం మూడేసి సార్లు ఈ వచనాలు పఠిస్తే ఆ వ్యక్తికి ఏ వస్తువూ కీడు తలపెట్టజాలదు.

## 6) హానికారక జంతువుల నుంచి రక్షణ కొరకు

"అవూజు బి కలిమాతిల్లాహిత్తామ్మాతి మిన్ షర్రి మా ఖలఖ్." (3 సార్లు)

అల్లాహ్ సృష్టి కీడు నుండి నేను ఆయన సంపూర్ణ నామాల శరణువేడుతున్నాను. (ముస్లిం)

### పఠించటం వల్ల ప్రయోజనమేంటి?

ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి, "దైవప్రవక్తా! రాత్రి నాకు తేలుకుట్టింది. దానివల్ల నాకు విపరీతమైన నొప్పి కలిగింది" అని అన్నాడు. అందుకాయన (స), "నీవు సాయంత్రం పూట ఈ వచనాలు పఠిస్తే ఏ వస్తువూ నీకు కీడు తలపెట్ట జాలదు" అని అన్నారు.

## 7) ఇది చదివితే అంతిమ దినాన అల్లాహ్ మిమ్మల్ని సంతోషపెడతాడు

రదీతు బిల్లాహి రబ్బన్, వబిల్ ఇస్లామి దీనన్, వబి ముహమ్మదిన్ నబియ్యా (3 సార్లు)

అల్లాహ్‌ను ప్రభువుగా, ఇస్లాంను ధర్మంగా, ముహమ్మద్ (స)ను దైవప్రవక్తగా నేను మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను. (అహ్మద్, తిర్మిజీ)

## 8) అన్నింటికీ అల్లాహ్ చాలు....

హస్బియల్లాహు లా ఇలాహ ఇల్లా హువ అలైహి తవక్కల్‌తు వహువ రబ్బుల్ అర్షిల్ అజీం (7 సార్లు)

అన్నింటికీ నాకు అల్లాహ్ చాలు. ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన పైనే నేను ఆధార పడ్డాను. ఆయన మహోన్నత సింహాసనానికి ప్రభువు. (అబూదావూద్)



## 9) మీ కర్మల ఖాతాలో పుణ్యాలు నింపే అతి తేలికైన నాలుగు వచనాలు

ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజ్ కోసం మస్జిద్‌కు బయలుదేరుతున్నప్పుడు జువైరియా (రజి.అన్హా) తాను నమాజ్ చేసుకునే చోట కూర్చొని (దైవధ్యానంలో నిమగ్నులై) ఉన్నారు. దైవప్రవక్త (సల్లం) బాగా ప్రొద్దెక్కిన తరువాత (మస్జిద్ నుండి) ఇంటికి తిరిగొచ్చారు. ఆమె అప్పటి వరకు అక్కడే కూర్చొని ఉన్నారు. ఆమెను చూసి దైవప్రవక్త (సల్లం), “నేను మస్జిద్‌కు వెళ్ళినప్పటి నుండి నువ్వు ఇక్కడే కూర్చుని ఉన్నావా?” అని అడిగారు. “అవును, దైవప్రవక్తా!” అని సమాధాన మిచ్చారు జువైరియా (రజి.అన్హా). అప్పుడు దైవ ప్రవక్త (స) ఇలా అన్నారు: నేను నీ దగ్గరి నుండి వెళ్ళిన తరువాత నాలుగు వచనాలు - ఒక్కొక్కటి మూడు సార్లు చొప్పున పఠించాను. వాటిని గనక ఈ రోజు నువ్వు చేసిన అల్లాహ్ ధ్యానంతో తూచితే

అవే ఎక్కువ బరువును తూస్తాయి. ఆ వచనాలు:

1) సుబ్‌హానల్లాహి వ బిహమ్‌దిహీ అదద ఖల్‌ఖిహీ

2) సుబ్‌హానల్లాహి రిజా నఫ్‌సిహీ

3) సుబ్‌హానల్లాహి జినత అర్షిహీ

4) సుబ్‌హానల్లాహి మిదాద కలిమాతిహీ

(ఇలా 3 సార్లు)

1. అల్లాహ్ సృష్టితాల సంఖ్యకు సమానంగా నేను అల్లాహ్‌ను స్తుతిస్తూ (మానవులు కలిగి ఉండే జననం, మరణం, సంతానం, ఆకలి, నిద్ర మొదలగు లోపాలు అయనకు లేవని) ఆయన పవిత్రతను కొనియాడుతున్నాను. 2. అల్లాహ్ సంతోషించే వరకు నేనాయన పవిత్రతను (మానవులు కలిగి ఉండే జననం, మరణం, సంతానం, ఆకలి, నిద్ర మొదలగు లోపాలు అయనకు లేవని) కొనియాడుతున్నాను. 3. అల్లాహ్ పీఠం బరువుకు సమానంగా నేను అల్లాహ్ పవిత్రతను కొనియాడు



తున్నాను. 4. అల్లాహ్ వచనాలను లిఖించడానికి ఎంత సిరా పడుతుందో అంతగా నేను అల్లాహ్ పవిత్రతను (మానవులు కలిగి ఉండే జననం, మరణం, సంతానం, ఆకలి, నిద్ర మొదలగు లోపాలు ఆయనకు లేవని) కొనియాడుతున్నాను.

(ముస్లిం)

## 10) రేయింబవళ్ళు ఇస్లాం ధర్మంపై స్థిరత్వాన్ని కోరుతూ ప్రార్థన

అస్‌బహ్‌నా (సాయంత్రమైతే "అమ్‌సైనా" అనాలి)అలా ఫిత్‌రతిల్ ఇస్లామి వ అలా కలిమతిల్ ఇఖ్‌లాసి వ అలా దీని నబియ్యినా ముహమ్మదిన్ వఅలా మిల్లతి అబీనా ఇబ్రాహీం, హనీఫన్ ముస్‌లిమా, వమా కాన మినల్ ముష్రికీన్.

ఇస్లాం ధర్మ సహజత్వంపై, స్వచ్ఛమైన వచనంపై, మా ప్రవక్త ముహమ్మద్ (స) ధర్మంపై,

ఏకోన్ముఖుడు, విధేయుడూ, బహుదైవారాధకులతో ఏ మాత్రం సంబంధం లేని మా పితామహుడు ఇబ్రాహీం విధానం ప్రకారం మేము తెల్లవారు జాములోకి ప్రవేశించాము (లేక సాయం కాలంలోకి ప్రవేశించాము). *(అహ్మద్)*

## 11) మీ సరికొత్త రోజుకు శుభారంభం ఈ ప్రార్థన

**(ఉదయం:)** అస్బహ్నా వ అస్బహల్ ముల్కు లిల్లాహి, వల్‌హమ్దు లిల్లాహి, లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీక లహూ, లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వ హువ అలా కుల్లి షైఇన్ ఖదీర్. రబ్బి! అస్అలుక ఖైర మా ఫీ హాజల్ యౌమి వ ఖైర మా బాదహూ వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీ హాజల్ యౌమి వ షర్రి మా బాదహూ. రబ్బి! అవూజు బిక మినల్ కసలి, వ సూయిల్ కిబరి. రబ్బి! అవూజు బిక మిన్ అజాబిన్ ఫిన్నార్ వ అజాబిన్ ఫిల్ ఖబరి.



తెల్లవారింది. అల్లాహ్ రాజ్యమంతా తెల్ల వారింది. సకల స్తోత్రాలూ అల్లాహ్‌కే. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒకే ఒక్కడు. ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే. ఆయన ప్రతి వస్తువుపై పరిపూర్ణ అధికారం కల వాడు. ప్రభూ! ఈ రోజులోని శ్రేయాన్ని, దీని తర్వాత కలిగే శ్రేయాన్ని ప్రసాదించమని అర్థి స్తున్నాను. ఈ రోజులోని కీడు నుంచి, దీని తర్వాత కలిగే కీడు నుంచి రక్షించమని నేను నీ శరణు వేడుతున్నాను. ప్రభూ! సోమరితనం నుంచి, విపరీతమైన వృద్ధాప్యం నుంచి నీ శరణు వేడు కుంటున్నాను. ప్రభూ! నరకాగ్ని శిక్ష నుంచి, సమాధిలో కలిగే బాధల నుంచి నీ శరణు వేడు కుంటున్నాను. (ముస్లిం)

**(సాయంత్రం:)** అమ్సైనా వ అమ్సల్ ముల్కు లిల్లాహి, వల్‌హమ్దు లిల్లాహి, లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీక లహూ,

లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వ హువ అలా కుల్లి షైయిన్ ఖదీర్. రబ్బి! అస్అలుక ఖైర మా ఫీ హాజిహిల్లైలతి వ ఖైర మా బాదహా వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీ హాజిహిల్లైలతి వ షర్రి మా బాదహా. రబ్బి! అవూజు బిక మినల్ కసలి, వ సూయిల్ కిబరి. రబ్బి! అవూజు బిక మిన్ అజాబిన్ ఫిన్నార్ వ అజాబిన్ ఫిల్ ఖబరి.

సాయంకాలం అయింది. అల్లాహ్ రాజ్యమంతా సాయంకాలం అయింది. సకల స్తోత్రాలూ అల్లాహ్‌కే. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒకే ఒక్కడు. ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే. ఆయన ప్రతి వస్తువుపై పరిపూర్ణ అధికారం కలవాడు. ప్రభూ! ఈ రాత్రిలోని శ్రేయాన్ని, దీని తర్వాత కలిగే శ్రేయాన్ని ప్రసాదించ మని అర్థిస్తున్నాను. ఈ రాత్రిలోని కీడు నుంచి, దీని తర్వాత కలిగే కీడు నుంచి రక్షించమని నేను



నీ శరణు వేడుతున్నాను. ప్రభూ! సోమరితనం నుంచి, విపరీతమైన వృద్ధాప్యం నుంచి నీ శరణు వేడుకుంటున్నాను. ప్రభూ! నరకాగ్ని శిక్ష నుంచి, సమాధిలో కలిగే బాధల నుంచి నీ శరణు వేడు కుంటున్నాను. (ముస్లిం)

## 12) తెల్లవార్లు, సాయంత్రాలు అల్లాహ్ దయతోనే

అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) తెల్లవారినప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు:

**(ఉదయం:)** అల్లాహుమ్మ బిక అస్‌బహ్‌నా వ బిక అమ్‌సైనా వ బిక నహ్‌యా వ బిక నమూతు వ ఇలైక న్నుషూర్.

అల్లాహ్! నీ కృపతోనే మేము ఓ కొత్త ఉదయం లోనికి ప్రవేశించాము. నీ కృపతోనే సాయంత్రం వరకూ ఉంటాం. నీ దయ వల్లనే మేము బ్రతికి ఉన్నాము. తిరిగి నీ ఆజ్ఞతోనే మరణిస్తాం. తిరిగి

లేపబడిన తరువాత మేమంతా నీ వద్దకే మరలి రావలసి ఉన్నది. (అబూ దావూద్- సహీహ్)

దైవప్రవక్త (స) సాయంత్రం వేళ ఈ విధంగా ప్రార్థించేవారు:

(సాయంత్రం:) అల్లాహుమ్మ బిక అమ్సైనా వ బిక అస్బహ్నా వ బిక నహ్యా వ బిక నమూతు వ ఇలైకల్ మసీర్.

అల్లాహ్! నీ కృపతోనే సాయంకాలం అయింది. తిరిగి నీ కృపతోనే తెల్లవారుతుంది. నీ దయ వల్లనే మేము బ్రతికి ఉంటాం. నీ ఆజ్ఞతోనే మరణిస్తాం. తిరిగి లేపబడిన తరువాత మేమంతా నీ వద్దకే మరలి రావలసి ఉంది. (అబూ దావూద్- సహీహ్)

## 13) ఈ ప్రార్థనతో మిమ్మల్ని మీరు నరకాగ్ని బారి నుంచి కాపాడుకోండి

అల్లాహుమ్మ ఇన్నీ అస్బహ్తు (సాయంత్రమైతే



"అమ్సైతు" అనాలి) ఉష్హిదుక వ ఉష్హిదు హమలత అర్షిక వ మలాయికతక వ జమీఅ ఖల్ఖిక అన్నక అన్తల్లాహు, లా ఇలాహ ఇల్లా అన్త వహ్దక లా షరీక లక, వఅన్న ముహమ్మదన్ అబ్దుక వ రసూలుక. (4 సార్లు)

ఓ అల్లాహ్! నేను ఓ క్రొత్త ఉదయం (లేక సాయంత్రం)లోనికి ప్రవేశించాను. నీ సాక్షిగా! నీ సింహాసనాన్ని మోస్తున్నవారి సాక్షిగా! నీ దూతల సాక్షిగా! నీ సర్వసృష్టి సాక్షిగా! నీవు మాత్రమే ఆరాధనలకు అర్హుడవని, నీవు తప్ప మరెవ్వరూ ఆరాధనలకు అర్హులుకారని, నీవు ఒక్కడివేనని, నీకు భాగస్వాములు ఎవరూ లేరని, ముహమ్మద్ (స) నీ దాసుడు, ప్రవక్త అని సాక్ష్యమిస్తున్నాను.

### పఠించటం వల్ల ప్రయోజనమేంటి?

ఈ దుఆను ప్రొద్దున లేక సాయంత్రం నాలుగు సార్లు చదివిన వ్యక్తికి అల్లాహ్ నరకాగ్ని నుండి విముక్తి కల్పిస్తాడు. (బుఖారీ, అబూదావూద్ 4/317)

## 14) అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోండి ఇలా....

అల్లాహుమ్మ మా అస్‌బహ (సాయంత్రమైతే 'మా అమ్‌సా' అని చెప్పాలి) బీ మిన్ నీమతిన్ అవ్ బిఅహదిమ్మిన్ ఖల్‌ఖిక ఫ మిన్‌క వహ్‌దక లా షరీక లక, ఫలకల్ హమ్‌దు వలకష్షుక్ర్.

ఓ అల్లాహ్! నేను గాని నీ సర్వ సృష్టిలో మరింకెవరైనా గాని ఈ ఉదయం పూట (లేక ఈ సాయంత్రం వేళ) పొందిన మేళ్ళన్నీ నీ వద్ద నుండి ప్రాప్తించినవే. నీకు భాగస్వాములెవరూ లేరు. స్తోత్రములు, కృతజ్ఞతలన్నీ నీకే చెందుతాయి.

**పఠించటం వల్ల ప్రయోజనమేంటి?**

ఎవరైతే ప్రొద్దున ఈ దుఆను చదువుతారో, వారు ఆ పగలు అల్లాహ్‌కు కృతజ్ఞత చెల్లించవలసిన బాధ్యతను నెరవేర్చిన వారవుతారు. ఎవరైతే



సాయంత్రం చదువుతారో, వారు ఆ రాత్రికి అల్లాహ్‌కు కృతజ్ఞత చెల్లించవలసిన బాధ్యతను నెరవేర్చిన వారవుతారు. *(అబూదావూద్ 4/318, నసాయి, ఇబ్నె హిబ్బాన్ 2361)*

## 15) ప్రతి రోజూ శుభశ్రేయాలు మీ సొంతం కావాలంటే....

(ఉదయం:) అస్‌బహ్‌నా వ అస్‌బహల్ ముల్కు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక ఖైర హాజల్ యౌమి ఫత్‌హహూ వ నస్‌రహూ వ నూరహూ వ బరకతహూ వ హుదాహు వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీహి వ షర్రి మా బాదహూ.

(సాయంత్రం:) అమ్‌సైనా వ అమ్‌సల్ ముల్కు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక ఖైర హాజిహిల్లైలతి ఫత్‌హహా వ నస్‌రహా వ నూరహా వ బరకతహా వ హుదాహా

వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీహా వ షర్రి మా బాదహా.

తెల్లవారింది (లేక సాయంత్రమయింది). సర్వ లోకాల ప్రభువైన అల్లాహ్ యొక్క విశ్వవ్యవస్థలోనూ తెల్లవారింది (లేక సాయంత్రమయింది). ఓ అల్లాహ్! ఈ రోజు (లేక రాత్రి)లోని మేలును, అంటే అందులోని విజయాన్ని, సహాయాన్ని, కాంతిని, అందులోని శుభాలను, దానిలోని రుజుమార్గాన్ని ప్రసాదించమని నేను నిన్ను ప్రార్థిస్తున్నాను. ఈ రోజు (లేక రాత్రి)లోని కీడును, దాని తర్వాత రాబోయే కీడు నుంచి నేను శరణు వేడుకుంటున్నాను.

(అబూదావూద్)

## 16) అల్లాహ్ రక్షణ లేకుండా రెప్పపాటైనా ఉండగలమా?!

యా హయ్యు యా ఖయ్యూము బిరహ్మతిక అస్తగీసు. అస్లిహ్ లీ షానీ కుల్లహూ వలా తకిల్నీ ఇలా నఫ్సీ తర్ఫత ఐనిన్



ఓ నిత్య సజీవా! విశ్వానికి ఆధారభూతుడా! నీ కారుణ్యం ఆధారంగా అర్థిస్తున్నాను. నా వ్యవహారాలన్నింటినీ చక్కదిద్దు. రెప్పపాటు సమయమైనా నన్ను నా మనసుకు అప్పగించకు. (హాకిమ్)

## 17) ఈ ప్రార్థనతో మీ శరీరంలోని సకలం కుశలం

అల్లాహుమ్మ ఆఫినీ ఫీ బదనీ, అల్లాహుమ్మ ఆఫినీ ఫీ సమ్'యీ, అల్లాహుమ్మ ఆఫినీ ఫీ బసరీ, లా ఇలాహ ఇల్లా అంత, అల్లాహుమ్మ ఇన్నీ అవూజు బిక మినల్ కుఫ్రి వల్ ఫఖ్రి, వ అవూజు బిక మిన్ అజాబిల్ ఖబ్రి, లా ఇలాహ ఇల్లా అంత. (3 సార్లు)

ఓ అల్లాహ్! నా దేహాన్ని సురక్షితంగా ఉంచు. నా వినికిడి శక్తిని సురక్షితంగా ఉంచు. నా కంటి చూపును సురక్షితంగా ఉంచు. నీవు తప్ప మరో ఆరాధ్య దేవుడు లేదు. ఓ అల్లాహ్! నీ పట్ల తిరస్కార

భావం కలిగివుండటం నుంచి, దారిద్ర్యానికి గురవటం నుంచి నీ శరణు వేడుతున్నాను. సమాధి యాతన నుంచి నీ శరణు వేడుతున్నాను. నీవు తప్ప మరో ఆరాధ్యుడు లేడు.

## 18) ఉదయాన్నే వీటికోసం ప్రార్థిద్దాం

అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఇల్మన్ నాఫిఆ, వ రిజ్ఖన్ తయ్యిబా, వ అమలమ్ ముతఖబ్బలా

ఓ అల్లాహ్! ప్రయోజనకరమైన విద్యను, ధర్మ సమ్మతమైన ఉపాధిని, స్వీకృతిని పొందే ఆచరణా భాగ్యాన్ని ప్రసాదించమని నేను నిన్ను ప్రార్థిస్తు న్నాను. (ఇబ్నెమాజా)

## 19) దైవప్రవక్త (స) ఎన్నడూ వదలని ప్రార్థన

అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఉదయం, సాయంత్రం ఈ ప్రార్థన చేయటం ఎన్నడూ వదలి పెట్టేవారు కాదు –



"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫిద్దున్యా వల్ ఆఖిరతి అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫీ దీనీ వ దున్యాయ వ అహ్లీ వ మాలీ. అల్లాహుమ్మస్తుర్ ఔరాతీ వ ఆమిన్ రౌఆతీ. అల్లాహుమ్మహ్ఫజ్నీ మిన్ బైని యదయ్య వ మిన్ ఖల్ఫీ వ అన్ యమీనీ వ అన్ షిమాలీ వ మిన్ ఫౌఖీ వ అవూజు బి అజ్మతిక అన్ ఉగ్తాల మిన్ తహ్తీ."

అల్లాహ్! నాకు ఇహపరాల్లో మన్నింపును, క్షేమాన్ని ప్రసాదించమని వేడుకుంటున్నాను. ఇంకా ప్రాపంచిక, ధార్మిక వ్యవహారాల్లో, సిరిసంపదల్లో, నా ఇంటివారి వ్యవహారాల్లో క్షేమాన్ని ప్రసాదించు. అల్లాహ్! నా లోపాలను మరుగుపరచు. నన్ను భయాందోళనల నుండి కాపాడు. అల్లాహ్! ముందు నుంచి, వెనుక నుంచి, కుడి నుంచి, ఎడమ నుంచి, పై నుంచి, క్రింది నుంచి నన్ను రక్షించు. నేను

క్రింది నుంచి నాశనమయి పోకుండా ( భూమిలో కూరుకుపోకుండా) ఉండాలని నీ ఔన్నత్యాన్ని శరణు కోరుతున్నాను. (అబూ దావూద్-సహీహ్)

## 20) షైతాన్ పురికొల్పే షిర్క్ కీడు నుంచి రక్షణ కొరకు...

అబూ బక్ర్ (రజి) ఇలా అంటున్నారు: నేనొకసారి దైవప్రవక్త (స)తో మాట్లాడుతూ, "దైవ ప్రవక్తా! నేను ఉదయం, సాయంత్రం చేసుకోవ టానికి అనువుగా నాకో ప్రార్థన ఉపదేశించండి" అని అడిగాను. అందుకాయన (స), "ఈ విధంగా ప్రార్థించు. ఉదయం, సాయంత్రం ఇంకా నిద్రపోవ టానికి పడక మీదకు చేరుకున్నప్పుడు కూడా నువ్వు ఈ ప్రార్థన చెయ్యవచ్చు" అని అన్నారు.

"అల్లాహుమ్మ ఆలిమల్ గైబి వష్షహాదతి ఫాతిర స్సమావాతి వల్ అర్ది, రబ్బ కుల్ల షైయిన్ వ మలీకహూ అష్హదు అల్లా ఇలాహ ఇల్లా అంత



అవూజు బిక మిన్ షర్రి నఫ్సీ వ మిన్ షర్రిష్షయి తాని, వ షిర్కిహీ వ అన్ అఖ్తరిఫ అలా నఫ్సీ సూఅన్ అవ్ అజుర్రహూ ఇలా ముస్లిమ్"

అల్లాహ్! గోచరాగోచరాల జ్ఞానీ! భూమ్యాకా శాల నిర్మాతా! సకల సృష్టికి యజమానీ! పరి పోషకా! నీవు తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్య మిస్తున్నాను. నేను నా అంతర్యంలో జనించే కీడు నుండి, షైతాన్ కీడు నుండి, అతని 'షిర్క్' కీడు నుండి నీ శరణు వేడుతున్నాను. ఇంకా నాకు నేను కీడు చేసుకోకుండా, నేను మరొకరికి కీడు తలపెట్టకుండా ఉండేలా నీ శరణు వేడుకుంటు న్నాను. (తిర్మిజీ)

## 21) ఈ ప్రార్థన రోజుకు 100 సార్లు...

లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్.

అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాములెవరూ లేరు. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయనదే. స్తోత్రం ఆయనకే. ఆయన ప్రతి వస్తువుపై సంపూర్ణ అధికారం కలిగి వున్నాడు. *(సహీహ్ ఇబ్నెమాజా 2/331)*

## 22) పాపాలు సముద్రపు నురుగులా ఉన్నా సరే, అన్నీ మన్నించబడతాయి

"సుబ్హానల్లాహి వ బిహమ్దిహీ" **(100 సార్లు)**

అల్లాహ్ తన స్తుతి సమేతంగా (మానవులు కలిగి వుండే) సకల లోపాల నుంచి పవిత్రుడు.

## 23) మనుషుల సంక్షేమానికి 'అల్లాహ్ క్షమ' ఒక్కటే శరణ్యం

"అస్తగ్ఫిరుల్లాహ వ అతూబు ఇలైహి"

**(100 సార్లు)**

నేను అల్లాహ్‌ను క్షమాభిక్ష వేడుకుంటున్నాను.



(నా పాపాలపై పశ్చాత్తాపంతో) ఆయన వైపుకే మరలుతున్నాను.

## 24) దైవప్రవక్త (స) కోసం దరూద్ పఠించటం మర్చిపోకండి

"అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్, వఅలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుం మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుం మజీద్."

**(10 సార్లు)**

ఓ అల్లాహ్! నీవు ఇబ్రాహీంను ఆయన కుటుంబం వారిని కరుణించినట్లుగానే, ముహమ్మద్ (స) ను మరియు ఆయన కుటుంబం వారిని

కూడా కరుణించు. స్తోత్రానికి అర్హుడవు. ఘనత కలవాడవు నీవే. ఓ అల్లాహ్! ఇబ్రాహీం (అలైహి)పై, ఆయన కుటుంబం వారిపై శుభాలు కురిపించి నట్లుగానే ముహమ్మద్ (స) మరియు ఆయన కుటుంబీకులపై కూడా శుభాలు కురిపించు. నిస్సందేహంగా స్తుతింపదగినవాడవు, మహో ఘనుడవు నీవే. *(బుఖారీ)*

**పఠించటం వల్ల ప్రయోజనమేంటి?**

"ఏవరైనా ఉదయం, సాయంత్రం పదిసార్లు నా కొరకు దరూద్ పఠిస్తే వారికి ప్రళయ దినాన నా సిఫారసు ప్రాప్తిస్తుంది" అని స్వయానా దైవప్రవక్త ముహమ్మద్ (స) ప్రవచించారు. *(తబ్రానీ)*



# ఆ దుఆలు

## (అన్నీ ఒక చోట)

1. అల్లాహు లా ఇలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూమ్, లా తాఖుజుహూ సినతున్ వలా నౌమ్, లహూ మాఫిస్సమావాతి వమా ఫిల్ అర్ద్, మన్ జల్లజీ యష్ఫఉ ఇన్దహూ ఇల్లా బి ఇజ్నిహీ, యాలము మాబైన ఐదీహిం వమా ఖల్ఫహుం, వలా యుహీతూన బిషైయి మ్మిన్ ఇల్మిహీ ఇల్లా బిమా షాఅ, వసిఅ కుర్సియ్యు హుస్సమావాతి వల్ అర్ద్, వలా యవూదుహూ హిఫ్జుహుమా వహువల్ అలియ్యుల్ అజీం. *(సూర బఖర 2 : 255)*

2. ఉదయం సాయంత్రం క్రింది మూడు సూరాలు

**సూరహ్ ఇఖ్లాస్ (3 సార్లు)**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ హువల్లాహు అహద్. అల్లాహుస్సమద్.

లమ్ యలిద్ వలమ్ యూలద్. వలమ్ యకుల్లహూ కుఫువన్ అహద్.

**సూరహ్ ఫలఖ్ (3 సార్లు)**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్. మిన్ షర్రి మా ఖలఖ్. వ మిన్ షర్రి గాసిఖిన్ ఇజా వఖబ్, వ మిన్ షర్రిన్నఫ్ఫాసాతి ఫిల్ ఉఖద్. వమిన్ షర్రి హాసిదిన్ ఇజా హసద్.

**సూరహ్ నాస్ (3 సార్లు)**

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్, మలికిన్నాస్. ఇలాహిన్నాస్, మిన్ షర్రిల్ వస్వాసిల్ ఖన్నాస్, అల్లజీ యువస్విసు ఫీ సుదూరిన్నాస్. మినల్ జిన్నతి వన్నాస్.

3. లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్. **(10 సార్లు)**



4. "అల్లాహుమ్మ అంత రబ్బీ లా యిలాహ ఇల్లా అంత, ఖలఖ్తనీ వ అన అబ్దుక, వ అన అలా అహ్దిక వ వాదిక మస్తతాతు, అవూజు బిక మిన్ షర్రి మా సనాతు అబూవు లక బినీమతిక అలయ్య, వ అబూవు లక బిజంబీ, ఫగ్ఫిర్లీ ఫఇన్నహూ లా యగ్ఫిరుజ్జునూబ ఇల్లా అంత."

5. "బిస్మిల్లాహిల్లజీ లా యదుర్రు మఅస్మిహీ షైవున్ ఫిల్ అర్ది వలా ఫిస్సమాయి వహు వస్సమీఉల్ అలీం." **(3 సార్లు)**

6. "అవూజు బి కలిమాతిల్లాహిత్తామ్మాతి మిన్ షర్రి మా ఖలఖ్." **(3 సార్లు)**

7. రదీతు బిల్లాహి రబ్బన్ వబిల్ ఇస్లామి దీనన్ వబి ముహమ్మదిన్ నబియ్యా **(3 సార్లు)**

8. హస్బియల్లాహు లా ఇలాహ ఇల్లా హువ అలైహి తవక్కల్తు వహువ రబ్బుల్ అర్షిల్ అజీం **(7 సార్లు)**

9. సుబ్హానల్లాహి వ బిహమ్దిహీ అదద ఖల్ఖిహీ, రిజా నఫ్సిహీ, జినత అర్షిహీ, మిదాద కలిమాతిహీ (3 సార్లు)

10. అస్బహ్నా (సాయంత్రమైతే "అమ్సైనా" అనాలి)అలా ఫిత్రతిల్ ఇస్లామి వ అలా కలిమతిల్ ఇఖ్లాసి వ అలా దీని నబియ్యినా ముహమ్మదిన్ వఅలా మిల్లతి అబీనా ఇబ్రాహీం, హనీఫన్ ముస్లిమా, వమా కాన మినల్ ముష్రికీన్.

11. (ఉదయం:) అస్బహ్నా వ అస్బహల్ ముల్కు లిల్లాహి, వల్హమ్దు లిల్లాహి, లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ, లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వ హువ అలా కుల్లి షైయిన్ ఖదీర్. రబ్బి! అస్అలుక ఖైర మా ఫీ హాజల్ యౌమి వ ఖైర మా బాదహూ వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీ హాజల్



యౌమి వ షర్రి మా బాదహూ. రబ్బి! అవూజు బిక మినల్ కసలి, వ సూయిల్ కిబరి. రబ్బి! అవూజు బిక మిన్ అజాబిన్ ఫిన్నార్ వ అజాబిన్ ఫిల్ ఖబరి.

(సాయంత్రం:) అమ్సైనా వ అమ్సల్ ముల్కు లిల్లాహి, వల్హమ్దు లిల్లాహి, లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ, లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వ హువ అలా కుల్లి షైయిన్ ఖదీర్. రబ్బి! అస్అలుక ఖైర మా ఫీ హాజిహిల్లైలతి వ ఖైర మా బాదహా వ అవూజు బిక మిన్షర్రి మా ఫీ హాజిహిల్లైలతి వ షర్రి మా బాదహా. రబ్బి! అవూజు బిక మినల్ కసలి, వ సూయిల్ కిబరి. రబ్బి! అవూజు బిక మిన్ అజాబిన్ ఫిన్నార్ వ అజాబిన్ ఫిల్ ఖబరి.

12. (ఉదయం:) అల్లాహుమ్మ బిక అస్బహ్నా వ బిక అమ్సైనా వ బిక నహ్యా వ బిక నమూతు వ ఇలైక న్నుషూర్.

(సాయంత్రం:) అల్లాహుమ్మ బిక అమ్సైనా వ బిక అస్బహ్నా వ బిక నహ్యా వ బిక నమూతు వ ఇలైకల్ మసీర్.

**13.** అల్లాహుమ్మ ఇన్నీ అస్బహ్తు (సాయంత్రమైతే "అమ్సైతు" అనాలి) ఉష్హిదుక వ ఉష్హిదు హమలత అర్షిక వ మలాయికతక వ జమీఅ ఖల్ఖిక అన్నక అన్తల్లాహు, లా ఇలాహ ఇల్లా అన్త వహ్దక లా షరీక లక, వఅన్న ముహమ్మదన్ అబ్దుక వ రసూలుక. **(4 సార్లు)**

**14.** అల్లాహుమ్మ మా అస్బహ (సాయంత్రమైతే 'మా అమ్సా' అని చెప్పాలి) బీ మిన్ నీమతిన్ అవ్ బిఅహదిమ్మిన్ ఖల్ఖిక ఫ మిన్క వహ్దక లా షరీక లక, ఫలకల్ హమ్దు వలకష్షుకర్.

**15.** (ఉదయం:) అస్బహ్నా వ అస్బహల్ ముల్కు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఖైర హాజల్ యౌమి ఫత్హహూ



వ నస్రహూ వ నూరహూ వ బరకతహూ వ హుదాహు వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీహి వ షర్రి మా బాదహూ.

(సాయంత్రం:) అమ్సైనా వ అమ్సల్ ముల్కు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఖైర హాజిహిల్లైలతి ఫత్హహా వ నస్రహా వ నూరహా వ బరకతహా వ హుదాహా వ అవూజు బిక మిన్ షర్రి మా ఫీహా వ షర్రి మా బాదహా.

**16.** యా హయ్యు యా ఖయ్యూము బిరహ్మతిక అస్తగీసు. అస్లిహ్లీ షానీ కుల్లహూ వలా తకిల్నీ ఇలా నఫ్సీ తర్ఫత ఐనిన్.

**17.** అల్లాహుమ్మ ఆఫినీ ఫీ బదనీ, అల్లాహుమ్మ ఆఫినీ ఫీ సమ్యీ, అల్లాహుమ్మ ఆఫినీ ఫీ బసరీ, లా ఇలాహ ఇల్లా అంత, అల్లాహుమ్మ ఇన్నీ అవూజు బిక మినల్ కుఫ్రి వల్ ఫఖ్రి, వ అవూజు బిక మిన్ అజాబిల్ ఖబ్రి, లా ఇలాహ ఇల్లా అంత. **(3 సార్లు)**



18. (ఉదయం:) అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఇల్మన్ నాఫిఅ, వ రిజ్ఖన్ తయ్యిబా, వ అమలమ్ ముతఖబ్బలా

19. "అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫిద్దున్యా వల్ ఆఖిరతి, అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుకల్ అఫ్వ వల్ ఆఫియత ఫీ దీనీ వ దున్యాయ వ అహ్లీ వ మాలీ. అల్లాహుమ్మస్తుర్ ఔరాతీ వ ఆమిన్ రౌఆతీ. అల్లాహుమ్మహ్ఫజ్నీ మిన్ బైని యదయ్య వ మిన్ ఖల్ఫీ వ అన్ యమీనీ వ అన్ షిమాలీ వ మిన్ ఫౌఖీ, వ అవూజు బి అజ్మతిక అన్ ఉగ్తాల మిన్ తహ్తీ."

20. "అల్లాహుమ్మ ఆలిమల్ గైబి వష్షహాదతి ఫాతిర స్సమావాతి వల్ అర్ది, రబ్బ కుల్లి షైయిన్ వ మలీకహూ, అష్హదు అల్లా ఇలాహ ఇల్లా అంత అవూజు బిక మిన్ షర్రి నఫ్సీ వ మిన్ షర్రిష్షయితాని, వ షిర్కిహీ



వ అన్ అఖ్తరిఫ అలా నఫ్సీ సూఅన్ అవ్ అజుర్రహూ ఇలా ముస్లిమ్"

21. లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలాకుల్లి షైయిన్ ఖదీర్. **(100 సార్లు)**

22. "సుబ్హానల్లాహి వ బిహమ్దిహీ" **(100 సార్లు)**

23. "అస్తగ్ఫిరుల్లాహ వ అతూబు ఇలైహ్"

**(100 సార్లు)**

24. "అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్, వఅలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుం మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుం మజీద్." **(10 సార్లు)**

## విన్నపం

ఈ పుస్తకంపై మీ సలహాలు, సూచనలను ఈ క్రింద తెలుపబడిన చిరునామాకు లేదా ఈ-మెయిల్‌కు పంపించ మనవి.

**హాఫిజ్ ఎస్.ఎం. రసూల్ షర్ఫీ**

*16-2-867/10, అక్బర్‌బాగ్, సయీదాబాద్,*

*హైదరాబాద్- 59. సెల్ :* ***9676144697***

*E-mail: shantimargam@gmail.com*

---

## శ్రేయోభిలాషులకు మనవి

ఈ పుస్తకాన్ని కనీసం 500 కాపీలు లేదా 1000, 1500, 2000 ఇలా ఎన్ని కాపీలైనా ముద్రించి దైవమార్గంలో ఉచితంగా పంచిపెట్టాలని కోరుతున్న శ్రేయోభిలాషులు వివరాల కోసం **"శాంతి మార్గం పబ్లికేషన్ ట్రస్టు"** వారిని సంప్రదించగలరు.

సెల్ : ***9676144697***

*E-mail: shantimargam@gmail.com*

## హదీసు వెలుగులో - 'అల్లాహ్ ధ్యానం'

(తనను సృష్టించిన) తన ప్రభువు (అల్లాహ్)ను స్మరించే వాడు బ్రతికున్న మనిషితో సమానం. స్మరించనివాడు చచ్చిపోయిన వానితో సమానం. (బుఖారి)

మనిషి తనను తాను అల్లాహ్ శిక్ష నుంచి కాపాడుకోవటానికి ఆయన ధ్యానాన్ని మించిన మార్గం లేదు.
(ఇబ్నె అబీ షైబా, తబ్రానీ)

ఒకసారి దైవప్రవక్త (స) తన సహచరుల్ని ప్రశ్నించారు: "మీ ఆచరణలన్నింటి కంటే ఉత్తమ ఆచరణ ఏదో చూపనా? అది మీ విశ్వ రాజ్యాధిపతి దృష్టిలో అన్నింటి కంటే పవిత్రమైనది. మీ స్థానాలలో కెల్లా ఉన్నతమైనది. ఇంకా, వెండి, బంగారాలు దానం చేయటం కన్నా మీ కోసం ఉత్తమమైనది. మీరు మీ శత్రువును ఎదుర్కొన్నప్పుడు, మీరు వారిని సంహరించటం లేక వాడు మిమ్మల్ని సంహరించటం కన్నా మేలయినది."

దానికి సమాధానంగా సహచరులు," తప్పకుండా తెలియ జేయండి ప్రవక్తా!" అన్నారు. అప్పుడు దైవప్రవక్త (స), "అది అల్లాహ్ నామ స్మరణ" అని వారికి తెలియజేశారు.
(తిర్మిజీ, ఇబ్నెమాజా)

"ముహమ్మద్ ఫఖ్రుల్ హుదా గారి పుణ్యసమర్పణార్థం"

*Morning Evening Supplications*

అల్లాహ్ అంటున్నాడు:

"నా దాసుడు నన్ను గుర్తు చేసుకుంటూ ఉన్నంత వరకు, నా కీర్తనకై అతని పెదాలు కదులుతూ ఉన్నంత వరకూ నేను అతని వెంట ఉంటాను."

(ఇబ్నెమాజా)



శాంతిమార్గం పబ్లికేషన్ ట్రస్ట్, హైదరాబాద్